పండిత శ్రీరామశర్మ ఆచార్య, మాతా భగవతీదేవి గార్ల సంరక్షణలో

# యుగసంధి ప్రబోధం

[యుగ సృజేతల సింహనాదం]

సంపుటి-1 మే 1996 సంచిక-12




భారతదేశం తిరిగి జగద్గురు పీఠాన్ని
అధిరోహించి తీరుతుంది.

# నివేదన

మాననీయ మనీషులారా.... ...............

కాలపురుషుని పిలుపుని సరిగ్గా అర్థం చేసుకొని కాలం విలువ గుర్తించండి. సత్యయుగాగమనానికి బహుకొద్దికాలము మాత్రమే వున్నది. ఈ కొద్దికాలాన్ని కూడా మతము, వర్గము, సంస్థ అని కొట్టుకుపోయే పరిస్థితిని ఏమనాలో ఆలోచించండి, పూజ్య గురుదేవులు పండిత శ్రీరామశర్మ ఆచార్య ఈ సమయంలో మనం నడవవలసిన విధిని తెలుపుతూ ఋషులందరి (గురువులందరి) కార్యక్రమాలను తన ముందుకు తీసుకువెళ్ళారు. దానిని అర్థం చేసుకొని "గురుసత్తా" ఆదేశాలను ఎప్పటికప్పుడు మనకు అందిస్తున్న శ్రీ ఆర్. కె. గారి నేతృత్వం దొరకుట మొత్తము ప్రపంచానికే ఓ పెద్దవరం. వారి ఆదేశానుసారమే అనేక కార్యక్రమాలు అద్భుతగతిన జరుగుతున్నవి. అవన్నీ మీరు గమనిస్తూ వుంటారు. వారి నేతృత్వంలో జరుపబడిన 2400 కుండీయ మహా యజ్ఞమును విశ్లేషిస్తూ మేమూ ఏప్రియల్ సంచికను ఇచ్చుట జరిగింది. అయితే ఆ సంచికలో యివ్వలేకపోయిన మిగిలిన అంశాలను ఈ సంచికలో యిస్తున్నాము గమనించగలరు. మొత్తం కార్యక్రమ విశేషాలను చదివిన తరువాత మీ అభిప్రాయాలను తెలుపగలరు అలాగే ఈ నెలతో మన పత్రికకు ఒక సంవత్సరం నిండుతుంది. కొన్ని టాలారిష్టాలు ఎదురైనా పత్రికను వీలయినంత వుపయోగకరంగా తీర్చిదిద్దుటకు ప్రయత్నించాను. చాలామందికి ఈ నెలతో సం॥ర చందా పూర్తి అయినది కనుక మీ చందాలను పునరుద్ధరించుకోగలందులకు ప్రార్థించుచున్నాను.

మీ
ఎడిటర్

# R. K. లెటర్స్:

Camp : విజయవాడ
25-4-96, 1-20 P.M.

ఆత్మీయ పరిజనులారా !

అనేక సార్లు మీకు రకరకాలుగా చెప్పినా జరిగిన విషయాలను గురించి (Past) తప్ప, ఎందుకు, ఏ పనిని చేశాము, అక్కడినుండి తరువాత చేతిలోకి తీసుకోవలసిన కార్యక్రమాలేవిటో హృదయం విప్పి చర్చించుకునే అలవాటు ఈనాటికీ కలుగలేదు. దీనికి కారణము లక్ష్యము మీద సరియైన అవగాహన లేకపోవటమే. భువిపై స్వర్గావతరణ లక్ష్యమే అయినా అది దిగటానికి సాధ్యమైన ఒకేఒక స్థలము గురించి మనము యోచన చేయుటం లేదు. అదే మహాత్ములందరూ చెప్పే దివ్యమైన స్థలము - మన హృదయాలే. హృదయాలలో దిగిన స్వర్గమే బాహ్యముగా అభివ్యక్తీకరించబడుతుంది. హృదయాలలో దిగిన ఆ స్వర్గము, అటువంటి హృదయాల పొందునే కోరుతుంది. అవతార్ మెహర్‌బాబా దానిని సహవాస కార్యక్రమం అన్నారు, మాస్టర్ E. K. గారు సహజీవన కార్యక్రమాలని అన్నారు, ఆచార్య శ్రీరామశర్మ గురుదేవులు గాయత్రీ పరివార్ అని అన్నారు, సాయి పరివార్ అన్నారు, ఇక్కడ చేరేవారి ఉద్దేశ్యము మొదట తమ హృదయాలలో స్వర్గమును దింపుకొని, అటువంటి హృదయము కలవారందరూ కలియుట.

ఈ లక్ష్యాన్ని త్వరగా సాధించుటకు సకల సమర్థ సద్గురువాణి ఒకే లక్ష్యాన్ని దింపదలచుకొన్నది అని అనుభూతి చెందినవారు తమ ఘోరమైన జడత్వాన్ని వీడి సంస్థలను విడనాడి ఒక ఆదర్శవంతమైన దేవ పరివారముగా ఏర్పడుటకు సన్నాహాలు సూక్ష్మజగత్తులో జరుగుచున్నాయి. ఇచ్చట గురువుల కంటే, గురువు ప్రబోధం ముఖ్యము. ఇది మంచిది అని చెప్పుట కంటె దీనిని ఆచరించి చూపుట ముఖ్యము. అందువలననే దేవ పరివారస్థాపన జరుపబడుచున్నది.

వ్యక్తిగత సాధనకు 4గంటలు, గురువుల ఉద్దేశ్య పూర్తి కోసం సమాజంలో 4గంటలు వెచ్చించగల్గే వ్యక్తులు దేవపరివార్ సభ్యులగుటకు అర్హులు. అన్యులు నన్ను కలవవలసిన ప్రయత్నం చేయకండి. ఏవిధమైన రాయితీలు (Concessions) అడగకండి.

మీ
శ్రీరామకృష్ణ

రామకృష్ణ పరమహంస ఇలా చెప్పారు — ఒక ఏనుగున్నది. దానిని స్నానము చేయించి వదిలివేస్తే మరల మట్టిలో పొర్లి, శరీరమంతా మట్టి అంటించుకుంటుంది. కాని స్నానం చేయించిన తరువాత ఏనుగులశాలలో కట్టివేస్తే మట్టి అంటించుకొనే అవకాశముండదు. మనిషి మనస్సు ఒక ఏనుగు వంటిదే. ఒకసారి ధ్యానము, భజన, సాధన చేసిన తరువాత దానిని ఇష్టము వచ్చినట్లు వదలివేయకూడదు. ఈ ప్రపంచములో మంచి, చెడు రెండూ ఉన్నాయి. అందువల్ల మనస్సు చెడువైపు పోకుండా కట్టివేయాలి.

ఈశ్వర భజన, ఆయన నిరంతర ధ్యానముతో మనస్సును కట్టివేస్తే, ప్రపంచములోని మలినత్వాన్నుంచి కాపాడుకోవచ్చు. భగవంతుని మాటమాటకి గుర్తుంచుకోవడం వల్ల, పాపముల నుండి రక్షించుకోవచ్చు. అంతేగాక జీవన లక్ష్యము గుర్తుంటుంది. అటువంటి పరిస్థితిలో చెడుకర్మలు చేయాలంటే మనస్సుకు భయం కూడా వేస్తుంది. తద్వారా పాపకర్మముల నుండి రక్షింపబడతారు.

# ఉపాసన - సాధన - ఆరాధన

గురువు గారు తన ఆత్మకథలో ఉ. సా. ఆ. గురించి వివరించారు. ఇది అనుక్షణము మన జీవితంలో ఎలా ఆచరించారో చెప్పారు. తను ఎలా వాటిని అనేక జన్మలుగా ఆచరించారో కూడా చెప్పారు. కబీరు, రామదాసు, పరమహంసలను వరుసగా ఉ. సా. ఆరాధన అనుకుంటే అవే జ్ఞాన, కర్మ, భక్తి యోగాలు.

మొదటగా ఉపాసన చేస్తాం. దానికి ప్రారంభంగా 3 మాలల గాయత్రిని చేస్తాం. నితిలో మాల తిరుగుతుంది. మనస్సు తన ఇష్టం వచ్చిన చోటికి తిరుగుతుంది. 3 మాలల జపం పూర్తవుతుంది. ఇదే ఉపాసన అయితే ఈ ప్రపంచంలో చాలా మంది గొప్పవాళ్ళు అయ్యే వారు. కాని ఇది సరియైన పద్ధతి కాదు. అని మనకు అనుభవం నేర్పుతుంది. మరి ఎలా చెయ్యాలి? ముందుగా నీకు నచ్చిన దేవతా పటం పెట్టుకో. ఉదా : రాముడు తర్వాత ఆరాముని లక్షణములు ఏంటి? అని ఆలోచించు. పితృవాక్య పరిపాలకుడు, ధర్మాచరణ, ఏకపత్నీ వ్రతం, తిరుగులేని నిర్ణయం, శత్రువులను కూడా అభయం ఇచ్చే వ్యక్తిత్వం ఆయనది. ఇవి కొన్ని ముఖ్యమైన మంచి లక్షణాలు తర్వాత పూజా విధానం. ముందుగా పవిత్రం అవ్వు. అంటే ఆరాముని సన్నిధిలో ఉన్న కొద్ది క్షణాలయినా నీలో ఉన్న మంచి, చెడును మరచి మనస్ఫూర్తిగా రాముని గురించి ఆలోచించు. తర్వాత ఆచమనం ద్వారా నీకు నచ్చిన 3 లక్షణాలను భావనాత్మకంగా లోనికి పిలువు. తర్వాత ప్రాణాయామం ద్వారా కూడా అదే చెయ్యి. తర్వాత న్యాసం వస్తుంది. అంటే మన శరీరంలో ఉన్న శక్తికేంద్రాలను జాగృతపరచి వాటిని మంచికి వినియోగించటమే న్యాసము. ఉదా : పెదవులు లేక నోరు తినడానికి, మాట్లాడటానికి ఉపయోగపడుతుంది. అంటే దాని ద్వారా మంచి, చెడు తినవచ్చు. మాట్లాడవచ్చు.

మంత్రంతో శుద్ధి అయిన నీటిని పెదవులకు రాసుకొని నేను నేటి నుంచి మంచి మాటలు, అందరికి ఆనందాన్ని ఇచ్చేవి, ఉత్సాహాన్ని ఇచ్చేవి మాట్లాడుతాను అనుకోవాలి. అలాగే మిగతా అవయవములు. ఈ

విధంగా ఒకవారం చేస్తే నువ్వు నోరు జారినప్పుడు, న్యాసం గుర్తుకు వస్తుంది. ఫలితంగా అప్పటి వరకు దుర్వినియోగం చేస్తున్న వాక్శక్తిని గుర్తుకు చేసుకుంటావు. చెడు మాట్లాడవు. ఎప్పుడైతే నీ మాట్లాడే పద్ధతి మారుతుందో నీ చుట్టుప్రక్కల వాతావరణం మారుతుంది. ఇతరులను దూషించడం మానివేస్తే, వారు మనతో మంచిగా ఉంటారు. ఇలా ఉండటంలో ఉన్న ఆనందం, కొట్లాడుకున్నప్పుడు ఉండదు కదా.

అంటే న్యాసంలో ఉన్న ఒక్క నోరును శుభ్రం చేసుకోవడం వలననే పరిస్థితులు మారితే, మిగతా అవయవములను కూడా కంట్రోల్ చేస్తే ఇంకెంత ఆనందం లభిస్తుందో కదా? చందనం పెట్టుకుంటూ మంచి ఆలోచిస్తాను, అని, పూలు వేస్తునప్పుడు నాలోని ఉత్సాహాన్ని, ఆనందాన్ని అందరికి పంచుతానని, బత్తీలు వెలిగించి, నా మంచితనంతో అందరిని ఆకర్షిస్తానని, నీరులాగా ప్రేమని, స్నేహాన్ని ఇస్తానని, దీపం లాగా వెలుగు ఇస్తానని, ఇతరులకు సాయం చేస్తానని, పదేపదే చెప్పుకోవడం వలన ఆ లక్షణాలు ప్రయత్న పూర్వకంగా కాక, సహజంగా మనకు అలవడుతాయి. నీలో ఏవిధమైన చెడు ఆలోచన, పనులు, మాటలు. వచ్చినా నీ పూజావిధానం, ఇష్టదేవత లక్షణాలు ఆ పనిని నువ్వు చేయనీకుండా ఆపుతాయి. 24 గంటలు నువ్వు నీ పనులను, ఆలోచనలను, మాటలు అదుపులో పెట్టుకొని ప్రేమ, త్యాగం, సహకారం మొదలగునవి మంచి లక్షణాలను పెంచుకోవడమే సాధన. ఇవి ఎంతవరకు చెయ్యాలి అంటే రామభక్తుడుని చూసి "అపర శ్రీరామచంద్రుడురా" అన్నంత వరకు నువ్వే ఆయనగా మారేంత వరకు స్వచ్ఛమైన మల్లెపువ్వులా గుబాళిస్తూ వుండాలి.

ఇతను ఎట్టి పరిస్థితులలోను తప్పు చెయ్యడురా అని లోకం నమ్మి, నిన్ను ఉదాహరణగా చెప్పుకొనేంతవరకు ఒకడు కోర్టులో ఉద్యోగం చేస్తున్నాడు లంచం తీసుకోడు. అది ఎలా తెలుస్తుంది? ఎన్ని పరీక్షలు ఎదురైనా, ఎన్ని ఆశలు చూపినా, ఎన్ని కష్టాలు వచ్చినా అతడు ఆపని చెయ్యడు. అసలు లంచం ఇచ్చేవాడు కూడా ఇతని దగ్గరకు వచ్చినపుడు లంచం అడగటానికి భయపడాలి. అదే ఉపాసన, సాధన అంటే. గాంధీ

గారు దగ్గర కాదుకదా. ఆయన Observeలో కూడా హింస చెయ్యటానికి జనం భయపడేవారుట. అదే సాధన అంటే. అంటే మనిషి ఈ భౌతిక జగత్తులో జీవిస్తూనే స్వచ్ఛమైన పనిపాప మనస్తత్వాన్ని కలిగిఉండాలి ఆ Saturation Point చేరేవరకు నీలో ఉన్న చెడును కడిగి వెయ్యాలి. అసలు పూజ అంటే యిదే, ఇదే ఉపాసనా సాధన. మనిషిగా మారాలి. పశువుల లక్షణాలు వదలటానికి ఉపయోగపడేదే పూజా విధానం. అంతే కాని భగవంతునికి ధూప, దీప, నైవేద్యాలతో ముంచెత్తడం కాదు. అనుక్షణం నీలో ఉన్న ఆరాక్షసుడిని బయటకి నెట్టే ప్రయత్నమే ఉపాసనా సాధన.

అంటే భగవంతుని ఉపాసిస్తున్న మనకు మంచి, చెడు విచక్షణా జ్ఞానం లభిస్తుంది. అదే జ్ఞానయోగం. మంచి తెలుసుకొని, చెడును వదలి, ఆ మంచిని ప్రాణసమానంగా ఆచరించటమే కర్మయోగం. ఇలా మారినవ్యక్తి తన జీవితాన్ని సంపాదన, తినుట, నిద్రించడానికి వినియోగించలేడు. తన జీవిత లక్ష్యమైన ఆరాధన చేస్తాడు. అంటే సమాజ అభివృద్ధికి, దాని పురోగమనానికి, అందులోని చెడును ఎదిరించి, దీనిని సన్మార్గములో పెట్టటానికి కృషి చేస్తాడు. ఇది యిప్పుడు చెయ్యగలడు. అంటే ప్రతి వ్యక్తిలోను భగవంతుడు ఉన్నాడు అని గుర్తించి, తను గాని, తాను వారిలో ఒకడుగా మారినప్పుడే ఇదే భక్తియోగం.

ఈ మూడింటిని ఆచరణలో పెట్టటానికే మనం ఏ పూజలు చేసినా, ఉపవాసాలు చేసినా అది వంతెనలుగా ఉపయోగపడతాయి.

గురువుగారు రోజుకి 66 మాలలు గాయత్రి చేసి తానే గాయత్రిగా మారారు. జీవితంలోని తక్షణవు సాధన చేశారు. ఇవి రెండు చేసినా వ్యక్తి ఆరాధన చెయ్యగలడు.

గిలక మీద తాడు వేసి నీళ్ళు చేదుతూ వుంటే గిలక చెక్కఅయినా తిరుగుతుంది. అలాగే ఎంత హీన వ్యక్తిత్వము గల వ్యక్తి అయినా ఉపాసన సాధన చేస్తే మనిషిగా మారవచ్చు. తన్ను తాను మలచుకొనేందుకు ఋషులు మనకి ఋయిచ్చిన విధానము ఉపాసనా సాధన

ఆచరణ కాని నేటి సమాజంలో వీటి అసలు అర్థం తెలియక పూజలు చేసే వాడిని చపట క్రింద జమకడుతున్నారు. మంచి మాట్లాడినా, చేసినా విచిత్రంగా చూస్తున్నారు. చూడటమే కాదు. అతని మంచితనాన్ని అసమర్థతగా ఎంచి వంచిస్తున్నారు. కష్టాలపాలు చేస్తున్నారు. ఈ దశ కొన్ని వందల సం॥గా అభివృద్ధి చెంది చివరికి నేడు పరాకాష్ఠ చేరుకున్నది. ఒక ఆడది బయటికి వెళ్ళి సవ్యంగా ఇంటికి చేరే వరకు తల్లి దండ్రులు తపన పడుతున్నారు. అంటే సమాజం అంత కుళ్ళినది అన్న మాట. దీనికి కారణం మన సంస్కృతి, వేదాలు, ఉపనిషత్తులు, ధర్మం, సాంప్రదాయం నేటి తరాలకు తెలియకపోవడమే. స్త్రీని తల్లిగా భావించే కర్మభూమి నేడు అతి నికృష్ట స్థితికి దిగజారింది. దీనికి కారణం మన సంస్కృతి తెలియకపోవడమే కాక పాశ్చాత్య సంస్కృతిని అనుసరించడం. తల్లిదండ్రులు ఎలా ప్రవర్తిస్తే పిల్లలు అలాగే ఉంటారు. అసలు వారే సవ్యమైన దారిలో లేరు. ఇక పిల్లల వరకు ఎందుకు ? జరిగిన దానిని గురించి వగచేకన్నా, జరగవలసిన దానిని గురించి యోచిస్తే మంచిది.

భావిభారత పౌరులమైన మనం ముందుగా మారి మన సంస్కృతి తెలుసుకొని, దానిని ముందు తరాలకి అందించడమే - దీనికి సరియైన పరిష్కారం; అంటే దీనికంతటికి ముఖ్యమైన "మంచిబుద్ధి" మనకి ఉండాలి ఉంటే రత్నాకరుడు లాంటి వాడు వాల్మీకి లాగా మారి రామాయణ కర్త అవుతాడు. నీవే మారితే చరిత్ర తిరగబడుతుంది. గురువు గారికి కావలసినది అదే, తిరగవేసి రామమంత్రం చదివినా, మనస్సు, ఆలోచన, కర్మ రాముడిలాగా చేసుకున్నాడు వాల్మీకి. అందుకనే మనం చేసే ఉపాసన, సాధన ఆచరణ రీతిన ఉండాలి. మన ఆలోచనలు, భావనలు, మాటలు, చేతలు మారాలి. ముందుకు యువతగా మనం మారి, సమాజాన్ని మార్చటానికి ప్రయత్నిస్తూ, ఋషిమయ జీవితాన్ని ఆరంభించాలి. అది ముందు తరాల వారికి, మనం అందించే అపూర్వ కానుక. ఇది మన ఒక్కరి చేతులలోనే వుంది. మనం మారి, మన వారసత్వానికి దానిని అందించటమే మనం గురువుగారికి ఇచ్చే దక్షిణ. ఆయన అడిగినది అదే.

సీత లవ, కుశలకు జన్మ నివ్వగలదు. శకుంతల భరతుడిని ప్రపంచానికి కానుకగా ఇచ్చింది. మరి ఈ దేవభూమి మీద జన్మనెత్తిన మనం, అతి కీలక సమయంలో జన్మ తీసుకున్న మనం, ఆ తీవ్రతని అర్థంచేసుకొని అలాంటి వారిని ముందు తరాలకి అందివ్వాలి. వానికి మన పెంపకం వ్యక్తిత్వం ఎలా ఉండాలి అంటే స్త్రీ బయటికి వెళ్ళినా, ఇంట్లో ఉన్నా ఒక్కలాగే ఉండాలి. కష్టాలు వచ్చినా, లోభమోహాలు ఎదురయినా చలించని చక్కటి వ్యక్తిత్వాన్ని మనం పెంచుకుంటూ మన ముందు తరాలకి అందించటమే యుగ సైనికులుగా మన కర్తవ్యం. ఒక వివేకానందుడులాగా, రాముడిలాగా మన బిడ్డలను మలచగలిగిన నాడే సత్యయుగం వస్తుంది.

---

ఈ పత్రిక సంవత్సర చందా రూ. 24/- లు.

M. O. ద్వారా

I. విజయభాస్కరరెడ్డి

ఎడిటర్, యుగసంధి ప్రబోధం

అడ్డరోడ్డు, సంతమాగులూరు (పోస్టు & మండలం)

సంతమాగులూరు - 523302 కు పంపించండి.

# సత్సంకల్పములు - సత్యయుగ స్థాపకుల జీవన విధానము

గురువుగారు 19వ సంవత్సరములో సత్సంకల్పములను అందించారు. కల్కి అవతార పురుషుడు ముందు అక్షర రూపంగా ప్రజలచే చెప్పబడి తర్వాత ఆచరణ ద్వారా అది తీవ్రత చెందిన తర్వాత అవతారముగా వస్తుందని కూడా చెప్పారు. ఈ సంకల్పములో మొదటిది.

"మేము ఆస్తికతను కర్తవ్య పరాయణతను మానవ జీవితము యొక్క ధర్మముగా కర్తవ్యముగా గుర్తిస్తాము".

దీనియొక్క Elobarated Form యే మిగతా సంకల్పములు. మొదటిదాని వివరణయే గురువుగారి జీవితం. ఆస్తికతను, కర్తవ్య పరాయణతల వివరణ మనకు ప్రతి అధ్యాయంలోనూ లభిస్తుంది. ఆస్తికత అంటే ముందుగా జపంతో మనం ప్రారంభిస్తాం. అలాగే గురువుగారు ద్విజత్వాన్ని పొంది, 5 మాలలు మంత్రల 5 సం॥ వేసినంతనే ఆయనకు "గురుసత్తా" సాక్షాత్కారం లభించింది. జపం లేనిరోజు భోజనము లేదు, అంతగా ఆచరించారు. మనమూ ముందుగా జపాన్ని ప్రారంభించాలి. తర్వాత గురువు గారికి ఆయన మూడు జన్మల వివరణ ఇచ్చి, ఈ జన్మలో చెయ్యాల్సిన పనులు చెప్పారు. "గురుసత్తా". దానినే తన కర్తవ్యంగా, మిగతా వాటిని సేవానిగా చేసి సమర్పణా భావంతో అంకితమయ్యారు.

రెండవది "శరీరమును భగవంతుని ఆలయముగా గుర్తించి, సంయమనం నియమపాలన ద్వారా ఆరోగ్యాన్ని రక్షించుకుంటాము".

దీనిలో ముఖ్యంగా మనం సంయమనం, నియమపాలన తీసుకుంటే వాటిని ఎలా ఆచరించాలో మొదటి అధ్యాయంలోనే చెప్పారు.

సంయమములు SIVA. వీటిని పాటించుటే నియమంగా భావించారు. ఎప్పుడైతే సంయమముల ద్వారా మనశ్శరీరాల శుభ్రం కావించు

టున్నావో అప్పుడు శరీరం "భగవంతుని అలయంగా" మారుతుంది. లేదా Vice Versa.

ఈ రెండు రొయొక్క పూర్తి అవరణయే గురువుగారి జీవితమనేది ఎట్లాగో గమనిద్దాం.

మొదటగా ఆస్తికత అంటే ఆత్మ సాన్నిధ్యంలో ఒంటరిగా ఉండటం, 2 శత్రువులు. క్రూర జంతువులను కూడా తన ప్రేమ వివేకములతో మార్చడం, 3) దైవీ సాన్నిధ్యాన్ని పొందటం. ఈ మూడుయే గురువుగారి ఇవ్వబడిన పరీక్షలు. ఆత్మసాన్నిధ్యం ఎలా లభిస్తుంది? 4 సంయమములు పాటించినప్పుడు అవి సమయ, ఇంద్రియ, వాక్, అర్థ సంయమములు.

మాష్టారు రాసే ఉత్తరాలలో పదేపదే ఇవి మనం ఎలా ఆచరించాలో చెపుతూనే ఉన్నారు, గురువుగారు తన ఆత్మకథలో నా జీవితములోని ఒక్క క్షణం కూడా వృథా కాలేదు అని చెప్పారు. ఇది ఎలా సాధ్యం అంటే మళ్ళీ మనం ఆత్మకథలోనే సమాధానం వెతుక్కోవాలి. ఈ టైమ్‌కి ఈ పని చెయ్యాలి అంటే ఖచ్చితంగా జరిగితీరాలి. ఉదా: గురువుగారు 24 సం॥ల అఖండజపమే. అలాగే మనం కూడా సాధ్యమైనంతవరకు ఆ పనిని అనుకున్న టైంకి చెయ్యటానికి ప్రయత్నించాలి

తరువాత స్వాధ్యాయం, మనల్ని మనం Observe చేసుకోవడం. దీనికి పుస్తకాలు చదవటం, సత్సంగములలో పాలుపంచుకోవడం. Syllabus అప్పుడు వానిద్వారా లభించిన జ్ఞానంతో మన అజ్ఞానం పోయి, మనం పవిత్రులుగా మారుతాం. అలాగే మంచి కార్యాలకి సమయాన్ని వెచ్చించటం మొదలగునవి. గురువుగారు 4 గంటలు చదివేవారు, యజ్ఞాది కార్యక్రమాలలో పాల్గొని సమయదానం ఇచ్చేవారు, తర్వాత వేదాది గ్రంథాలను అనువదించటంలో తమ సమయాన్ని వెచ్చించారు. అంటే గురువుగారు 66 మాలల జపంతో ప్రారంభించారు. 6 గంటల సమయం దానికి. తర్వాత స్వాధ్యాయం. తరువాత సమయదానం. తర్వాత పుస్తకములు అనువదించడం. ఇలా ప్రతీక్షణం

మంచిలోనే గడచిపోయింది. పాపం టి. వీ, రేడియోలకి, షికార్లకి, సినిమాలకి టైం మిగలలేదు. కాని మనకి ఈ పుణ్యకాలమంతా వాటితోనే గడచిపోతుంది. తద్వారా ఆలోచనలు, ఆచరణలు, మాటలు పెడత్రోవ పడుతున్నాయి. ఈ జీవిత విధానం మారటానికి ఈ కార్యక్రమాలన్ని మాష్టారు మనకి ఏర్పరచి మనల్ని సరియైన త్రోవలో నడిపిస్తున్నారు. ఇంతా వివరాలు కావాలంటే గురువుగారి పుస్తకములే కరదీపికలు.తర్వాత ఇంద్రియ సంయమనం. కామక్రోదాధుల నుండి మనస్సును వశ్యించి మంచిదారిలో పెట్టుకొనుటయే ఇంద్రియ సంయమనం. శీతోష్ణాలను సహించడం కూడా ఇంద్రియ సంయమనమే అని తన యాత్రలో వాటిని సహిస్తూ గురువుగారు మనకి మార్గదర్శకులయ్యారు. కన్ను, చెవి, నోరు, వేలు మొదలగునవి చెడు చెయ్యకుండా ఉండటానికే ఈ సాధన. ఇవి Controlor లో లేకే మానవజాతి నేడు కష్టాల పాలపడి ది. గురువుగారు సబర్మతీ ఆశ్రమంలో ఉండి ఒకే పనిని అనేకరోజులు చేసి తన సహనాన్ని, ఇంద్రీయ సంయమాన్ని మనకు ఇన్‌డైరెక్టగా తెల్పారు, తరువాతది వాక్‌సంయమనం. గురువుగారు నేను సమాజానికి చేస్తున్న సేవ (లేక) Miracles నా బ్రాహ్మణ జీవితాన్నుంచె పొందినది" అని చెప్పారు. అది వాక్‌సంయమము వలననే. ఒక వ్యక్తి 14 సం॥లు అబద్ధం ఆడకుంటే వాక్‌సంయమం కలిగివుంటే అతడు ఏది అంటే అది జరుగుతుంధి.కనుక గురువుగారిలాగే అంతత్ వృత్తితో కాకపోయినామన పరిధిలో వాక్ సంయమాన్ని కలిగిఉండాలి. తర్వాతది అర్థసంయమం. ముఖ్యంగా ఇది యువతపై వాటికన్నా ఎక్కువ ఆచరణలో పెట్టవలసిన అంశం సంయమనం అంటే పరిధిలో తన డబ్బుని దుర్వినియోగం చేయక, దానిని తన కుటుంబానికి ఖర్చు పెడుతూ, మిగతాదానిని మంచికే వినియోగించుట ఇక్కడ గురువుగారు 16వ సంకల్పంగా ఒక్క విషయాన్ని ఈ డబ్బు సంపాదన ఎలా ఉండాలో చెప్పారు.

అది కష్టపడి నీతిగా సంపాదించిన దైతేనే వినియోగించాలి. అలాగాక ఎలాగోలా సంపాదించిన ధనాన్ని మనం వినియోగించినా అది మహాపాపాన్ని పోగొట్టుకోవడానికే తప్ప ఎందుకూ పనికిరాదు. గురువుగారు తనకు వారసత్వంగా వచ్చిన దాన్ని

అంతా పరివార్‌కే వెచ్చించారు. తనకోసం, కుటుంబము కోసం దానిని వెచ్చించలేదు. అసలు తన అనేది ఆయనకు తెలియదు. ఈ విధంగా మనకి వారసత్వంగా లేక కష్టపడితే వచ్చిన ధనమునే మంచికి వినియోగించాలి అంటే ఇన్‌డైరెక్టుగా అయాచిత వ్రతాన్ని ఆచరించమన్నారు. రెండూ ఒకటే. తర్వాతది నా ఇల్లు. నేను అనే స్వార్థం వీడి అపరిగ్రహ వ్రతాన్ని ఆచరించారు. అంతే తనదైన జ్ఞానాన్ని, ధనాన్ని, శ్రమని శరీరాన్ని సమాజానికే వినియోగించారు. ఇదే 15వ సంకల్పం. దానికి ఆలంబన పరమార్థం కొరకు అంటే సమాజానికే తన జీవితాన్ని వెచ్చించారు. 14వ సంకల్పం నా స్వార్థం కొరకు కాక పరమార్థానికే నా జీవితాన్ని అంకితం చేస్తాను అని మనతో చెప్పించారు. ఇది ఎప్పుడు సంభవిస్తుందంటే "నేను సమాజంలోని అభిన్న అంగమే" అన్న దృఢభావన వల్ల ఇది ఇంకొక సంకల్పం, ఈ భావాలు స్వాధ్యాయ, సత్సంగములు మంచి పుస్తకములు చదివిన పరిజ్ఞానంతో వస్తుంది. ఇది "స్వాధ్యాయ సత్సంగములకు, సాధన, సంయమములు సమయానికి పాటిస్తాను". ఇంకొక సంకల్పంగా పెట్టి, వీటిని ఆచరిస్తే మనచుట్టు ప్రసన్న, ఆనంద పూరిత వాతావరణం ఏర్పడి, తద్వారా ప్రసన్న చిత్తులమై మంచిని గ్రహించి, సమాజానికే మన జీవితాన్ని అంకితం చెయ్యడానికే ఈ విధముగా ఇంకొక సంకల్పాన్ని మనకి అందించారు. ఇవి అన్నీ ఆయన ఆచరించి తర్వాత మనకి అందించారన్న విషయం మనం మరువరాదు, ఇంకా పతివ్రతా, పత్నీవ్రత ధర్మాలను ఆచరించండి అని ఇంకొక సంకల్పములో మనతో చెప్పించారు. ఇవి పాటించకపోవడం వలన నేడు జరిగే అనర్థాలు మనం చెప్పుకోవలసిన అవసరం లేదు. పై వాటన్నింటిని పాటించిన వ్యక్తి జనరల్‌గా సమాజానికి శత్రువుగా మారినట్టు అది భావిస్తుంది, ఉదా : ఒక వ్యక్తి లంచం పుచ్చుకోడు. అది ఆయన సిద్ధాంతాలకి విరుద్ధం. కాని నేటి సమాజం దానిని అసమర్థతగా భావిస్తున్నది. అనేకరకాలుగా ఆ వ్యక్తి తమతో కలవమని, 'లేక అనేక రకాలుగా హింసిస్తోంది. కాని ఆ వ్యక్తి లొంగడు. ఎందుకంటే అవినీతితో పొందిన సాఫల్యము కంటే నీతిమార్గాన పొందిన పరాజయాన్ని స్వీకరిస్తాను"అని ఒక సంకల్పాన్ని అతడు గురుసత్తాని తీసుకున్నాడు. దానికొరకు అతడు

అనేక కష్టాలు సహిస్తాడు కాని సినిమాలో హీరోలా తన సంకల్పాన్ని వీడటం, పైన చెప్పినవన్ని తన నిత్యజీవితంలో ఆచరిస్తూ, తన అనే స్వార్థం వీడి సమాజానికే తన మనశ్శరీరములు, ధనాన్ని, సమయాన్ని అంకితం చెయ్యటమే ఆస్తికతలో తన కర్తవ్యం. ఇవి అన్నీ సాధించటానికి సాధనలు, జపాలు మొదలగునవి అంటే వ్యక్తి ఆత్మప్రగతినిసాధించాలన్న మాట. ఆత్మజ్ఞానం అంటే పవిత్రంగా ఉండి తనలోని శక్తిని సమాజానికి అర్పించటమే.

ఇక్కడ ఒక ముఖ్య విషయాన్ని మనం సంకల్పాలలో గుర్తించాలి. ఒక్క మొదటిదానిలో తప్ప అదీ ఆస్తికత అనే పదం తప్ప సంకల్పాలలో గురువుగారు ఎక్కడా సంసారాన్ని, సమాజాన్ని విడవమని కాని, లేక అడవులలో ముక్కుమూసుకొని కూర్చోవ స కాని, లేక మడి ఆచారాలతో ఇంట్లోవారిని వేధించమని, జపాలు పూజలు అంటూ బాహ్య ఆడంబరాలు చెయ్యమని చెప్పలేదా? 14 సం॥లు కఠిన తపస్సు చేయడమేకాక, 60 సం॥ దాటిన తర్వాత వీరభద్రసాధన చేసిన ఆయన ఈ మాట చెప్పడం విచిత్రంలా అనిపిస్తుంది. అంటే గురువుగారు సంకల్పాలలో వాటిని చేర్చలేదంటే దానికన్నా ముఖ్యమైనది. ఇంకోటి ఉన్నదన్నమాట అదే సమాజసేవ. “నేను కూడా నా సర్వస్వాన్ని విరాట్ — బ్రహ్మ విశ్వ మానవునికే అర్పించాను” అని పదేపదే గురువుగారు తమ ఆత్మకథలో వ్రాసుకున్నారు.

అంటే గురువుగారు జీవితాంతం చేసింది మనల్ని చెయ్యమన్నది అదే. మొదటి రెండు సంకల్పాలకి సమాధానం 18వ సంకల్పము. దానిని ఎలా ఆచరించాలో చెప్పేవే మిగతా 15 సంకల్పములు. 18వ సంకల్పంగా “మనిషి తన భాగ్యాన్ని తానే నిర్మించుకుంటాడు. మనం మారితే యుగం మారుతుంది అని అన్నారు. మనం మారితే అంటే మన ఆలోచనలు మారితే అని. గురువుగారి విచార్ క్రాంతి అభియాన్ను సం॥లో ప్రతిపాదించారు. “ఆలోచనా విధానాలలో క్రాంతి” అన్న మాస్టారు వ్రాసిన పుస్తకములో దాని వివరణ ఉన్నది. సంకల్పాలలో గురువుగారు ఇచ్చినది యిదే. క్రాంతిని ఏవిధంగా ఆచరణలో పెడితే సమాజం మారి సత్యయుగం వస్తుందో గురువుగారు ఆయన ఆచరిస్తూ మనకి చెప్పారు.. ఒకసారి గురువుగారు Shave వేసుకున్న

తరువాత ఆ సెట్ కడుగుతున్నారు ఇంతలో అక్కడ ఉన్న శిష్యుడు నేను కడుగుతాను అనిఅన్న వెంటనే గురువుగారు వద్దు ఓపిక ఉన్నంత వరకు మన పనులు మనమే చేసుకోవాలి. ఇతరులకి చెపితే పాపం అని అన్నారు. చూడండి గురువుగారు Simple Living & High Thinking. అదే ఆలోచనా విధానంలో మార్పు రావలసిన పద్ధతి. గురువుగారు ఉపవాస సమయంలో మాతాజీ అనుకోకుండా బత్తాయిరసం యిస్తే త్రాగారు. కాని వెంటనే బయటకుపెట్టి ఎప్పుడైతే ఇండియాలో అందరూ బత్తాయిరసం త్రాగేస్థితిలో ఉంటారో అప్పుడు నేను త్రాగుతాను అని తన సర్వస్వాన్ని సమాజానికే అర్పించినా ఆయన అన్న మాటలుయివి ఇదే సమాజసేవలో జీవితం గడపడమంటే ఇలా వివరిస్తే ఎన్నో గురువుగారిలా తన మాటను మంచిగా వ్యక్తీకరిస్తూ అదే ఎదుటవారిని సంతోషపెట్టడానికీ, ఉత్సాహం ఇవ్వడానికి ఉపయోగపడేలా ఉంటూ, తన చేతలు ఎదుటివారి కోసమే, తన ఆలోచనలు ఎదుటివారి కోసమో, తన శరీరం, ఆస్తి చివరకు తన సర్వస్వమూ సమాజానికి అందించే వారి జీవితమే సత్యయుగంలో ఉంటుందని ఆచరణాత్మకంగా మనకిచెప్పారు. (స్థాయిలో % తేడా ఉండవచ్చు. గురువుగారితో పోటీలేదు). మనం కూడా మన ఆలోచనలు మార్చుకొని, ఆస్తికత అంటే శరీరంలో ఉన్న భగవంతుడిని గుర్తించి, అతడు ఇచ్చిన సర్వస్వాన్ని సమాజానికే అంకితం చెయ్యుటమే గురువుగారు ఇచ్చిన వారసత్వాన్ని మనం పుచ్చుకుందాం. నేటినుంచి ఆయన వారసులుగా మారదాం. మనల్ని మనం మలచుకుందాం. సంకల్పాలను నిజ జీవితంలో ఆచరణలో పెట్టటమేమన వారసత్వ ప్రధానవిధి. స్వర్గాన్ని భూమి మీదకు తేనీ, భూమి స్వర్గముగా చేస్తాను అని ప్రతిజ్ఞ చేశారు. స్వర్గం అంటే సత్యయుగ పురుషులు ఎల్లప్పుడూ ఉండే స్థలం. మరి గురువుగారితో అడుగు కలిపిన మనం ఆ ఆలోచనా విధానాన్ని అమలుపరుద్దాం, అలా పయనించటానికే మాస్టార్ గారి ఆధ్వర్యములో నిన్న నేడు జరుగుతున్న కార్యక్రమాలు మనకీ సవ్యమైన దిశను మాస్టారు అందిస్తున్నారు. దిక్సూచికి అనుగుణంగా నావికుడు పయనించినట్లు మాస్టారు ఇచ్చిన దిశలో మనమూ పయనిద్దాం. భువినే స్వర్గముగా మారుద్దాం. ఈ ప్రయత్నంలో మనకు చేయూతనిచ్చి సహకరించేవి గురువుగారి పుస్తకాలు. ఆయన ఇచ్చిన ఈ అమూల్యకానుకలు, మనమూ తీసుకుందాం. చదువుదాం. ముందుకు సాగుదాం. యుగాన్ని నిర్మిద్దాం.

యు గ ని ర్మా ణ యో జ నా కీ - జై

# "సామవేదసంహిత"

"వేదానాం సామవేదోఽస్తి" (వేదాలలో సామవేదాన్ని నేను) అన్నాడు కృష్ణభగవానుడు. వేదాలు జ్ఞాననిధులు. అయితే సామవేదము గానం గానానికి భావసంవేదనకు పరాపరి తిన్నగా సంబంధం వున్నది. జ్ఞానం ఫలితం విశ్వాసం, భావన యొక్క పరిపక్వ స్థితి శ్రద్ధ. "భవానీ శంకరౌ వందే శ్రద్ధ విశ్వాస రూపిణౌ" అని తులసిదాస్ అన్నట్లు "ఏం టి సిద్ధ పురుషుడైనా తన అంతఃకరణలో నెలవై వున్న పరమేశ్వర తత్వాన్ని జ్ఞాన + భావనల సంయోగం వల్లనే సాక్షాత్కరింప చేసుకోగలడు. కాని అటువంటి జ్ఞాన + భావనల సంయోగమే ఈ సామవేదము.

"చరాచర జగత్తు పైన సంగీతం యొక్క ఇంతటి ప్రభావానికి కారణం ఏమిటని" ఒక యోగీశ్వరుని ప్రశ్నించగా ఈ సృష్టి యావత్తు లయబద్ధమైన సంగీతమయం అలౌకిక సంగీతము యొక్క ఒక దివ్య ప్రవాహం సృష్టిఅంతటా సదా సంచరిస్తుంది. దీనిని "అనాహతనాదం"గా వర్ణించటానికి ఎందరో కృషి చేశారు. ఓంకార ధ్వని ప్రణవం. ఈ దివ్య సంగీతంగానే చెప్పబడింది" అని బదులు పలకటం జరిగింది.

వేద వృక్షమందు సామవేదం పుష్పం. వృక్షం ఎంత గొప్పదైనా దాని సార్థకత పువ్వు మీద ఆధారపడి వుంటుంది. కాన సామవేదగానం జ్ఞానానికి + భావానికి దారితీసి భగవత్ స్థానం సాక్షాత్కారానికి · దారి తీస్తుంది.

ఈ సామవేదం నందలి "అగ్ని పర్వము"ను నా ఆత్మసోదరి శ్రీమతి గౌరిసావిత్రి మూర్తిగారు తెలుగు సంకలనం పరమపూజ్య శ్రీరామశర్మ ఆచార్య గురుదేవుని వసంత పంచమి (25-1-96) సందేశంతో చేశారు. వారు పొందిన భావసంవేదనలు ఈ "సామవేద సంహిత" పుస్తకంగా వచ్చేందుకు ఆర్ద్రతను తెచ్చిపెట్టినవి. "గురుకృప" సంపూర్ణముగా సోదరి గారిని వారి కుటుంబాన్ని సదా వాత్సల్యముతో భగవత్సాన్నిహిత్యానికి తీసుకువెళుతుంది.

ఈ "సామవేద సంహిత" పుస్తకమును శంకర జయంతి (22-4-96) రోజున పూజ్యశ్రీ R. K. గారి కరకమలముల మీదగా సీతారాం (విజయవాడ) గారి యింటివద్ద అవిష్కరించబడినది, ప్రతి ఆధ్యాత్మిక జిజ్ఞాసి చదవవలసిన పుస్తకమిది.

మీ

ఎడిటర్

# 2400 కుండీయ మహాయజ్ఞ ప్రత్యేక వ్యాసాలు

## సారధి — సమరోత్సాహం

గాయత్రీ తపోశక్తితో భరతభూమి వేడెక్కుతున్న సమయం అది. 1972వ సంవత్సరపు రోజులు. "కఠోర తపస్సుకై హిమాలయాలలోనికి వెళ్ళబోతున్నాను. నన్ను కలవదలచిన సాధకులకు మధురకు నా ఆహ్వానమంటూ పత్రికలలో పిలుపునిచ్చారు. యుగఋషి ఈ పిలుపుకు స్పందించిన ఓ కాంతికిరణం అటుగా తన ప్రయాణాన్ని సాగించింది. ఎక్కడి కాశీ? ఎక్కడి మధుర? భగవంతుని లీలలు అనూహ్యం. జూన్ 2వ తేది లీలామానుషుని అద్భుతలీల ఒకటి నిశ్శబ్దంగా జరిగి పోయింది. అదే ప్రస్తుతం మనం చెప్పుకోబోతున్న విషయం. ఆనాటి యుగఋషి మహాక్రాంతి దర్శియైన శ్రీరామశర్మ ఆచార్యులు. ఆ కాంతి కిరణమే మన మధ్య నడయాడుతున్న శ్రీరామకృష్ణ గారు, వీరి కలయిక ఫలితమే మనం ఈనాడు వింటున్న, కంటున్న గాయత్రీమంత్ర విశేష ప్రచారం, విశిష్ట ఆధ్యాత్మిక సాధనాశిబిరాలు విలక్షణ మహాయజ్ఞాలు.

కామేపల్లి అడ్డరోడ్డు నందు (3-3-96) దేవసంస్కృతి దిగ్విజయ యాత్ర శంఖారావం పేరుతో గాయత్రీ బ్రహ్మాస్త్ర ప్రయోగ ద్వితీయ

చరణం. కనీవినీ ఎరుగనంత అద్భుతంగా నేటి ఆధ్యాత్మిక సారధియైన పూజ్యశ్రీ శ్రీరామకృష్ణ గారిచే నిర్వహించబడినది అది 2-3-96 యజ్ఞస్థలి యందు ప్రత్యేకంగా గుర్తించిన (యస్. యస్. ప్రసాదు. కాంతారావు, వెంకటేశ్వర్లు గార్లచే) గాయత్రీ మందిరములో సాయంహారతి సమయం. గాయత్రీ చాలీసా సామూహిక గానం జరుగుతుంది. స్వచ్ఛమైన వినీల ఆకాశంలో 18 రేకుల పద్మం ధవళ కాంతితో (10 అడుగుల వ్యాసం సుమారు) సాక్షాత్కరించింది. ఈశాన్యమూల నుండి యజ్ఞస్థలిలోకి చేరుకున్న పద్మం చాలా సేపటికి రాయంచలిసోయగాన్ని దిద్దుకుంది. అవే మహాశంఖంగా రూపునందుకొని. చివరకు మత్స్యావతారముగా నిలిచిపోయింది. రాత్రి 12 గంటల సమయానికి ఆకాశంలో ఈ దృశ్యం మారిపోవటం ప్రముఖ కార్యకర్తలందరూ దర్శించి మౌనముగా ఆ అనుభూతులను ఆస్వాదించారు.

భౌతికపరమైన, దృగ్గోచరమైన ఈ లీలలు యుగసైనికులలో ఉత్సాహాన్ని మరింత పెంచి అసాధ్యమేమోనని భయపడిన కార్యక్రమాన్ని ఒక చిన్న ఆటలాగా పూర్తిచేసి శ్రద్ధానిష్టలతోను తమతో ఎవరికి వారే తీసుకెళ్ళి తమ కార్యక్షేత్రాలలో నాటుకున్నారు.

## యజ్ఞమండలి శాస్త్ర విషయాలు

సంఖ్యాశాస్త్రపరంగా 3 సంఖ్యకు విశేషస్థానం ఉన్నది. గురుసత్తా నిర్ణయించిన ఈ యజ్ఞంలో అనేక త్రిపుటుల సంగతీకరణ జరిగి సాధకులలో అంతర్ శక్తుల వికాసానికి దోహదపడింది. తేదీ 3 గురించి చెప్పుకోవాలంటే ఈ యజ్ఞాధి దేవత గాయత్రి. గాయత్రీ బ్రాహ్మీ — వైష్ణవీ — శాంభవీ శక్తుల త్రిపుటీకరణమే అందుచే గాయత్రిని త్రిపద అన్నారు నెల (మాసానికి సంబంధించిన) మూడు సంఖ్యను చెప్పుకోవాలంటే మానవునిలోని 3 అవస్థలు జాగ్రద - స్వప్న - సుషుప్తులు. సత్వ - రజ - స్తమో గుణములు. ఇడ - పింగళ - సుషుమ్న నాడులు. దైవీ శక్తితో అనుసంధానం కలిగించేవి) ఈ విధంగా త్రయీ విద్యలను పై 3 సంఖ్యకు సంకేతంగా అన్వయించుకొనవచ్చు. 96వ సం॥పు సంఖ్య లోని 3 సంఖ్యనే పూర్ణంగా చూడగల్గేట్లు ఇదొక రహస్యాన్ని మనకు చెబు

తుంది. (మూడు మూడు తొమ్మిది. అలాగే రెండు మూడులు ఆరు కదా వీనిలోని కేవలం 3నే గమనించగలిగితే 3-3-96 = నాలుగు మూడులు. 3+3+3+3=12. ద్వాదశ రాశిచక్రం, ఇది జ్యోతిర్విద్యకు సంకేతం. సాధకుడు జ్యోతిష్యశాస్త్రపరంగా తన రాశిచక్రంలో మార్పులు గుర్తుచేసుకొని తదనుగుణంగా సాధన చేసినట్లయితే త్వరితగతిలో ఆధ్యాత్మిక ప్రగతిని సాధించవచ్చు.

పూజ్య దాదాజీ ఆచార్యులకు చెప్పిన మాటలను జ్ఞప్తికి తెచ్చుకుంటూ 3-3-96 తేదీని షట్చక్ర జాగరణ సంకేతంగా గుర్తించవచ్చు. 3-3-3-3-3-3-3=7 మూడులు. 7 సంఖ్య షట్చక్ర సంకేతం. "త్రిసప్త సమిధః కృతాః" అన్న పురుషసూక్త అన్వయం కూడా ఇక్కడ జరిగింది. ఆర్. కె. గారు యుగసైనికులైన సాధకులచే 28-2-96 నుండి షట్చక్రజాగరణ కొరకై షట్చక్ర వివరణ — బీజ మంత్రముల ఉచ్ఛారణ విశిష్ట ఆకృతులు గల యజ్ఞకుండీలలో విశేష ఆహుతులతో యజ్ఞం చేయించారు. ఈ విధంగా సాధకుని షట్చక్ర జాగరణ జరిగి మహాప్రాణసాగరం సవితతో లింక్ చేశారు. ఈ కారణం వలననే ప్రతివ్యక్తి 50 మంది చేసే పనిని అనాయాసంగా ఆ రోజుల్లో చేయగల్గారు.

96లోని 9 సంఖ్యను 3చే భాగాహరిస్తే 3 మిగులుతుంది. అలాగే 6 సంఖ్యను 3చే భాగాహరిస్తే 2 మిగులుతుంది. ఇలా మిగిలిన 3+2=5 ఈ సంఖ్య వ్యక్తిలోని పంచకోశాలు, పంచతత్వాలు, పంచతన్మాత్రలకు సంకేతం. యజ్ఞస్థలిలో ప్రతిరోజూ పంచసూక్తాల పారాయణ జరిగింది. కుంతీదేవికి బాల్యకాలంలో దుర్వాసమహర్షి పంచీకరణ విద్యను ప్రసాదించి పంచపాండవుల జననానికి బీజం వేశారు. ఈనాటి యజ్ఞానికి దుర్వాసమహర్షి స్వయంగా విచ్చేశారు. భౌతికమైన ఆరాక చిహ్నాలను ప్రత్యక్షంగా అనేకమంది సాధకులు గమనించుట జరిగింది.

24 సంఖ్య వ్యక్తిలోని 24 ప్రాణశక్తి కేంద్రాలకు సంకేతం. ఈ శక్తికేంద్రాలు సవితాశక్తితో జోడింపబడుట అది గాయత్రీమంత్ర శక్తితో ఒక మహాద్భుతం. ఆనాటి శక్తిధారలు సాధకులలో ప్రాణశక్తి

కేంద్రాలలో దైవీచేతనత్వం నింపింది. ఈవిధంగా సూర్యకిరణ విజ్ఞానాన్ని ఉపయోగించుకుంటూ శ్వాస ప్రధానంగా అనేక రహస్యాలను తనలో దాచుకొని 3-3-96న 2400 కుండీయ మహాయజ్ఞం జరుపబడింది ఇదంతా ఎందుకు చెప్పుకోవలసి వస్తుందంటే గుప్తవిద్య రహస్యాలను భాగస్వామ్యానికి అందజేయడానికి పరమ గురువులు సంసిద్ధంగా వున్నారు. వ్యక్తిలో చేతనత్వ వికాసానికి అస్త్రశాస్త్ర విద్యాప్రదానానికి ప్రకృతి అనుకూలంగా వరదానాలను ఇస్తోందన్న రహస్యం ఈ సంఖ్యలు మనకు తెలియజేస్తున్నాయి. ఆనాటి ఆ ఉత్సాహాన్ని చల్లారనీయక సాధనలో ముందు ముందుకు నడుద్దాం.

# సామవేద స్వరూపమే మన యజ్ఞం

జన సామాన్యంలో ఈ యజ్ఞాల గురించిన అవగాహన సరియైన రూపుదిద్దుతోలేదింకా. దేవపూజనము, సంగతీకరణము, దానముల ఏకత్వమే యజ్ఞం. దేశకాల పరిస్థితి వల్ల మానుష్యుల స్వార్థపర్వతంవలన ఈ యజ్ఞప్రక్రియ తెరచాటు కెళ్ళిందని చెప్పుకోవచ్చు. సహాయజ్ఞా ప్రజాసృష్ట్యా అన్న జగద్గురు వాక్యాన్ని మరల జనసందోహం జ్ఞప్తి తెచ్చుకుంటున్నారంటే అనేకసాంప్రదాయాలకు చెందిన వివిధ గురువులు ఈనాడు చేస్తున్న యజ్ఞాలే కారణం.

సంపూర్ణ మానవాళి ఆలోచనా సరళి (దిశను) మార్చడానికి పూజ్య గురుదేవులు వాజపేయ యజ్ఞాన్ని, గాయత్రీమంత్ర మాధ్యమంగా ఇంటింటికీ అందిస్తున్నారు. ఉచ్చారణా సౌలభ్యం కొరకు ఈ యజ్ఞాన్నే "గాయత్రీ యజ్ఞం" అన్నారు. వేదానాం సామవేదోస్మి అన్నారు కృష్ణ పరమాత్మ

ఈ సామవేదంలో యజ్ఞవిద్య గురించి (అగ్ని విద్య) చెప్పబడినది. సామవేదోక్త ప్రకారం జరిగిన నాటి యజ్ఞవిశేషాలు ఒకటి రెండు చెప్పుకుందాం.

సామవేదం :

"జిజ్ఞానః సప్త మాతృభిర్మేధా మాశాసత శ్రియే.
అయం ధ్రువో రయీణాం చికేతతా ॥

భావం : 7గురు తల్లులకు (జ్వాలలకు) జన్మించినవాడు యాజకులలో మేధాశక్తిని పెంపొందించే నిమిత్తం. సదా ప్రయత్నశీలుడై యుండే ఈ అగ్ని చక్కని అవగాహన కల్గియున్నాడు.

మానవుని మేరుదండమందు నిక్షిప్తమైన ఏడు శక్తికేంద్రములే 7 జ్వాలలు. వీని జాగరణ కొరకే సామూహిక విశిష్ట యజ్ఞం సాధకులచే చేయించబడినది.

(28-2-96 నుండి)

"అగ్నిం పురాతన యుత్నోరచిత్తా
ద్విరణ్య రూపావ మవసే కృణుధ్వం"

భావము : యజ్ఞ ప్రక్రియ యొక్క పరిరక్షణకు, అగ్నిస్థాపనకుముందే ఘోషణల ద్వారా అగ్నిని సాక్షాత్కరింప చేసెదముగాక.

పై వేదవాక్కును అనుసరించి 2-3-96న పరిజనులచే కలశ యాత్ర నిర్వహింపబడి జయ ఘోషణలతో 21వ శతాబ్ది ఉజ్వల భవిష్యత్తు ఆగమనానికి అగ్నిని ప్రార్థించడం జరిగింది. విశ్వ కల్యాణానికై చేసిన జయ జయ ధ్వనులు అంతరిక్షంలో వ్యాపించాయి.

అగ్నిమింధాన్ వ నసాధి యుగమ్
సచేత మర్త్యః అగ్నిమింధే వివస్వభిః ॥

భావం : మనోయోగ పూర్వకముగా అగ్నిని ప్రజ్వలింప చేయగల సాధకుడు తనలోని శ్రద్ధను కూడా జాగృతం చేసికోగలడు.

ఎందరో వ్యక్తులు యజ్ఞాన్ని దర్శించి శ్రద్ధాళువులై వేదమాతను తమతో తీసుకెళ్ళారు. ఈ యజ్ఞం ఎందరికో నూతన చైతన్యాన్ని అందించిందనడంలో సందేహం లేదు.ఇది పూర్తిగా ఆగమ విధి విధానంలో చేయబడినది.

"శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" అన్నది ఆర్యోక్తి. ఇక్కడ జ్ఞానమంటే గురుదేవులు చెప్పే ఆత్మసంయమనం. ఈ శ్రద్ధను సాధకులకందించిందే యజ్ఞం.

# గాయత్రీ బ్రహ్మాస్త్ర ప్రయోగ విశేషాలు

కురుక్షేత్ర మహాసంగ్రామం పూర్తయి మహాభారత (గొప్ప క్రాంతి) స్థాపన జరిగింది. యుద్ధాన్ని జయించలేని అశ్వత్థామ (గురు పుత్రు) వాక్ సంయమాన్ని కోల్పోయి "అపాండవమస్తు" అంటూ బ్రహ్మాస్త్ర ప్రయోగము చేశాడు. దీనిని ఎదుర్కొనటానికి అర్జునునికి బ్రహ్మాస్త్ర ప్రయోగము తప్పని సరియైంది. వ్యాసుని ఆశ్రమంలో జరిగిన ఈ ప్రళయాగ్నిని చల్లార్చడానికి దేవర్షి జోక్యం అవశ్యకమైనది. గురుపుత్రునికి అస్త్రాన్ని వెనుకకు తీసుకోడం చేతకాలేదు. సుమారు 5 వేల సం॥ల క్రిందట జరిగిన ఆ బ్రహ్మాస్త్ర ప్రయోగ ఫలితమే ఈనాటి మానవజాతి వికృత ఆలోచనలు వికార నడతలు తీరుతెన్నులు.

సామాజిక, భౌతిక, ఆచరణాత్మక స్థాయిని సమున్నతం చేయగలిగేది ఋషులు మాత్రమే. ఇది ధర్మ వేదిక బాధ్యత. యుగసంధి సమయంలోని ఈ కష్టదశ నుండి మానవ సమూహాన్ని రక్షించడానికి, గురుసత్తా ప్రతినిధిగా ధర్మవేదిక బాధ్యతను పూజ్య గురువర్యులైన శ్రీరామశర్మ గారు చేపట్టారు. దీనిలో ఒక భాగంగా దేవమాత, వేదమాత, విశ్వమాతల ఏకీకృత శక్తియైన గాయత్రీ మంత్రశక్తిని యజ్ఞ ప్రక్రియతోజోడించినఅపరిభిషక్(ధన్వంతరి)గురుదేవులుసూక్ష్మసత్తాలో విలీనమై పంచ వీరభద్రులుగా పనిచేస్తున్న విషయం తెలిసినదే. ఈ చేతనత్వం వైపు ఆధ్యాత్మిక జిజ్ఞాసులను నడిపిస్తూ, పృథ్విని స్వర్గంగా మార్చే ప్రయత్నాలను గురుదేవుల మానస పుత్రులైన శ్రీరామకృష్ణ గారు స్వీకరించారు.

బ్రహ్మాస్త్రాన్ని బ్రహ్మాస్త్రంతోనే ఎదుర్కొనాలి. దీనికి నాందిగా 23-8-95 నుండి సామూహికంగా భావనతో గూడిన గాయత్రీ మంత్ర బ్రహ్మాస్త్ర ప్రయోగం వివిధ ఆలయ ప్రాంగణాలలో అనుదినం సామూహికంగా జరుపబడింది. మా మనో - వాక్కాయ కర్మలలో ఆ శ్రేష్టమైన సవితా తేజస్సును, అజ్ఞానాంధకారాన్ని పోగొట్టే దివ్యమైన శక్తిని ధారణ చేస్తున్నాను. అది మా బుద్ధులను సన్మార్గం వైపు ప్రేరేపించు గాక అన్నట్టి తరంగాలను సూక్ష్మ లోకాలలో నింపాం. 27వ అశ్వ

మేధంగా అవల్‌ఖేడా గ్రామంలో జరిగిన అర్ధ పూర్ణాహుతిలో భాగంగా శక్తిధారల మహాభిషేకం కార్యక్రమాన్ని 1995 నవంబరు 5, 6, 7 తేదీలలో వేటపాలెంలో జరుపుకొని బ్రహ్మాస్త్ర ప్రయోగ ప్రథమ చరణాన్ని విజయవంతంగా పూర్తి చేశాం.

నాటి పూర్ణాహుతి నాడే కామేపల్లి గ్రామంలో 2.400 కుండీలతో 3-3 96న గాయత్రీ మహాయజ్ఞం దేవసంస్కృతి దిగ్విజయ శంఖారావమనే పేరుతో బ్రహ్మాస్త్రప్రయోగ ద్వితీయచరణానికి సుముహూర్తం నిర్ణయించబడింది. గురుసత్తావే మొదటి యజ్ఞంలోని సాధకుల దీక్షను మెచ్చిన గురుసత్తా ఆశీఃఫలమే కామేపల్లి యజ్ఞం.

అనాటి యజ్ఞశాలలపై దర్శనమిచ్చిన హంస పతాక, వివిధ ధ్వజాలు చూస్తే నిజమైన కురుక్షేత్ర సంగ్రామమే గుర్తు వచ్చింది. కార్యకర్తల కొరకు ఏర్పాటు చేయబడిన శిబిరాలు సైనికుల శిబిరాల తలంపు తెచ్చాయి. వాతావరణమంతా యుద్ధసన్నద్ధ చిహ్నలే. వివిధ రంగుల ధ్వజాలు అనేక దేవతలకు ఆహ్వానాలను అందిస్తూ, వారి రాకకు రెపరెపలతో తమ ఆనందాన్ని వ్యక్తపరచాయి, 10 ఎకరాల స్థలములో ఎటు చూసినా గద, అంకుశ, చక్ర, శంఖు, హంస వగైరా పతాకాలు ధ్వజం ధరించిన యజ్ఞమంటపాలే.

భౌతికంగా ఆసురీశక్తుల విజృంభణ వున్నప్పటికి, రక్షించేవాడే శక్తిమంతుడన్న విషయం స్మరణలోకి తెచ్చిందా నాటి కార్యక్రమం.

అనేక ఋషులు, దేవాత్మలు ఆ కార్యక్రమానికి విచ్చేశారు. సత్యయుగ వాతావరణం అందరికి అవగాహనలోనికి వచ్చింది. ఆధ్యాత్మిక సార్వభౌమ గ్రంథరాజముగా సుప్రసిద్ధి చెందిన బ్లావెట్స్కీ, విరచితమైన సీక్రెట్ డాక్ట్రిన్ పుస్తకంలోని ప్రథమ భాగం. తెలుగు వెలుగు చూచినా అమృత క్షణాలు ఆనాడే అనేక ఆధ్యాత్మిక రహస్యాలను మానవజాతికి అందిస్తూ తమ ఆశీస్సులను ప్రత్యక్షంగా గుప్తవిద్య పుస్తక రూపంలో అందించిన విశిష్టత కూడా ఆ యజ్ఞానికే చెల్లింది.

ఇన్ని విశేషాలను గ్రహించిన మనం మనను మనం సాధకులుగా మలచుకుంటూ స్వాధ్యాయ, సత్సంగాలతో ప్రతివ్యక్తి ఒక శక్తిగా మారి కాలపురుషుని ఆజ్ఞను శిరసావహిస్తూ తృతీయ చరణంలోనికి అడుగిడాలన్న సంకల్పంతో సాగిపోదాం.

# ఆలోచనా విధానము

మన జీవితంలో మొదటిఘట్టం మన ఆలోచనలే. మన ఆలోచనా విధానం మంచిగా వుంటే మన జీవితం కూడా ఒక మంచి మలుపు తిరుగుతుంది. కాలం వెనుకకు మళ్ళదు. నిరంతరమూ ముందుకు సాగుతూనే వుంటుంది, ప్రజల నమ్మకాలు ఆలోచనా విధానాలు మారుతూవుంటాయి. ఉపయోగపడని, పనికిరాని ప్రాచీన అలవాట్లను పూర్వ ప్రతిష్టను నిలబెట్టటానికి ప్రయత్నించిన వ్యక్తిది. అతని మొండితనమేగాని తెలివి అనిపించుకోదు. వయస్సు పెరుగుతున్నకొలది మన ఆలోచనలు కూడా భూభ్రమణంలాగా తిరుగుతూ వుంటాయి. ఒకప్పుడు వున్న ఆలోచనలు ఒకప్పుడు వుండవు. అలా చంచలమైన ఆలోచనలు మనలో వుండకూడదు. ఈ యుగంలో మానవుడు జ్ఞానానికి పాత్రుడు. అది సద్వినియోగం చేసుకోవాలి లేకపోతే అంతా వ్యర్థము అయిపోతుంది, మన ఆలోచనా విధానం ఎంతవరకు మార్పుచెంది మానవాళికి ఉపయోగపడినదో కొన్ని ఉదాహరణలు చూద్దాం.

ప్రాచీన కలములో భూమిని త్రవ్వి గృహాలు నిర్మించేవారు. ఇంకొద్దిగా ఆలోచనా విధానం మార్పుచెంది పర్ణశాలలు నిర్మించడము ఎక్కువ సులభం అనిపించింది. ఇలాగే ఈనాడు చూస్తే అనేక అంతస్థుల భవన నిర్మాణమునకు ఇటుక, సున్నము, సిమెంటు ఉపయోగించడం జరుగుతోంది.

ఒకప్పుడు ఈ ఫ్యాన్లు, టీ, వి.లు, ఎలక్ట్రానిక్‌కు సంబంధించినవి కానివ్వండి, కంప్యూటర్‌కి సంబంధించినవి ఇలాంటి ఏమిలేవు. ఈనాడు మనము అందరమూ సుఖంగా ఉండటానికి ఫ్యాన్‌లు మొదలగునవి ఉపయోగపడేవి తయారుచేశాడు. ఇలాగే మీరు కూడా మీ ఆలోచనలను వ్యర్థంగా వుపయోగించకుండా లోకానికి ఉపయోగపడేటట్లు ఆలోచనా విధానములో మార్పు తెచ్చుకోండి.

కాలచక్రం కదలిపోవుచున్నది. క్షణాలు కదలి నిమిషాల్ని దొర్లిస్తున్నాయి. నిమిషాలు దొర్లి గంటల్ని నడిపిస్తున్నాయి. గంటలు గడచి రోజుల్ని ఊగిస్తున్నాయి. రోజులు ఊగి మాసాల్ని ఊపుతున్నాయి.

మాసాలు కదలి సంవత్సరాల్ని తోస్తున్నాయి. కాలం వెనుకకు మళ్ళదు. ముందుకు సాగుతూనే వుంటుంది. అందుకనే మనమంతా కాలాన్ని వాదనలతో, పనికిరాని ముచ్చటింపులతో వ్యర్థం చేయవద్దు. తరువాత మీరు బాధపడినా కాలం మీరు కలిచినప్పుడల్లా వెనుకకు మళ్ళదు, ఆ టైంలోనే కాలాన్ని సద్వినియోగం చేసుకోండి

వ్యక్తి యొక్క వాస్తవిక సంపద అతని వ్యక్తిత్వము ఆలోచనా విధానములో మొదటిది శ్రమ. కాలముతోపాటు కష్టపడి శ్రమను వుపయోగించుకుంటే మన శరీరంలో వున్న అద్భుత శక్తులను వెలికితీయవచ్చు. దీనివల్ల స్థాయి పెరుగుతుంది. శ్రమ యొక్క మూల్యము పెరుగుతుంది. శ్రమవల్ల ప్రపంచంలో ప్రగతిశీలురకు ఆశ్చర్యజనకమైన ఉన్నతిని ప్రసాదించి పెడుతుంది. ప్రతి వ్యక్తిలోను అద్భుతశక్తులు వున్నాయి. కాని వాటిని మనము వినియోగించుకోలేకపోతున్నాము.

ఇంకొక సంపన్నత పొందుటకు కృషి చేయవలసినది — విద్య. విద్య కూడా ఎంత అవసరమో మీ అందరకూ తెలిసినదే.

వ్యక్తి కృషి చేయవలసిన మూడవ క్షేత్రము అంతఃకరణ, మానస సరోవరములోని జలములో మెదిలే తరంగాల వంటి భావసంవేదనలు గంగా, భాగీరథిలో ఏర్పడే ఉత్తుంగ తరంగాల వంటి ఆలోచనలు ప్రతి అంతఃకరణలో ఉంటాయి. కఠోరత అనే బండరాయి అడ్డముగా వుండుట వలన ఈ భావసంవేదనలు వెలికిరాలేక పోతున్నాయి.

బండరాయి దాటితే ఈ భావసంవేదనలు బహిర్గతమై మనిషి ఉదారుడై ఉచ్ఛస్థాయి చేరి సేవాసాధనలు చేయడానికి తగిన శక్తిని పుంజుకొని ఋషి లాగ రూపొందుతాయి.

నిజానికి కొంతమంది మారలేక పోతున్నాము అని అంటూ వుంటారు. ప్రతి వ్యక్తి వద్ద శరీరము, మనస్సు, అంతఃకరణము అనే 4 ఖజానాలు వున్నాయి. వాటిని ఉపయోగించి కాలమును సద్వినియోగం చేస్తూ శ్రమతో ముందడుగు వేస్తే ప్రతివ్యక్తి జీవితం వికసిస్తుంది.

సాధన చేయటమే కాదు ఎక్కువ సద్గుణములు అవసరము. కాని మనలో వ్యసనములు వున్నప్పుడు పెరిగిన సంపత్తి వుపయోగపడక పోగా అది ప్రమాదాలకు కూడా దారితీస్తుంది.

అంటే మీరు ఎంత ధనవంతులయినా, ఎంత చదువుకున్నవార యినా, ఎంత గొప్పవారైనను, ఆ విద్య ఆ ధనము ఒకరికి ఉపయోగ పడకుండావుంటే అది కేవలం మీ స్వార్థం కొరకే అయితే అంతా బూడిదలో పోసిన పన్నీరులాగా అయిపోతుంది. అది ఇతరులకు వుపయోగించడమే అసలైన సాధన సద్గుణము.

మనస్సులో వున్న అవాంఛనీయతలను తుడిచివేసి శక్తిశాలి ఆలోచనా విధానాన్ని ప్రవేశపెట్టుకొనగలిగి ఈనాటి విపరీత ధోరణులను తలక్రిందులు చేసే భవ్యమైన నూతన పరిస్థితులు నిర్మించవచ్చు.

కొన్ని సమయాలలో అనాచారము అంటువ్యాధివలె ప్రబలుతుంది. దుష్ట ఆలోచన, భ్రష్టఆచరణ ఈనాడు సర్వసామాన్యములు అయిపోయినాయి. శక్తిని సజ్జనులు మాత్రమే సదుపయోగం చేసుకోగలరు.

మోసం, కుతంత్రాలకు అలవాటుపడ్డ బుద్ధి ఔచిత్యము యొక్క మర్యాద మరచిపోయింది. లోక మానసమును ఎదిరించి నీతి, నిష్టా, సమాజనిష్టాలాంటి ఆదర్శములను తిరిగి ప్రవేశపెట్టాలన్న అనే భావనకు బలం లభిస్తుంది,

ఆధ్యాత్మిక, భావనాత్మక స్థాయిని మార్చకుండా యుగపరివర్తన జరగదు.

ఇతరులను గురించి పట్టించుకొనక పోవడంవల్ల బుద్ధి భ్రష్టత వల్ల ఏ క్షణమైన సంపూర్ణ వినాశం తప్పదు.

విజ్ఞానం ద్వారా లభించిన యంత్రములు ఈ విపరీత పరిస్థితులకు కారణం కాదు. వాటి దురుపయోగమే కారణం. అవి ఉపయోగపడితే ఎంతో వికాసాన్ని పెంచుతుంది. [సంపూర్ణ ఖనిజ, వృక్ష, జంతువులలో ఉన్న గొప్పతనాన్ని మానవసముదాయం ] గ్రహములనుబట్టి చేసిన అనేక విధములైన ఫలిత జ్యోతిష లెక్కలు కూడ 21వ శతాబ్ది సత్యధర్మ శాంతి త్రివేణిగా అభివర్ధిస్తున్నాయి.

ఈ కాలపు సమాజ శాస్త్రజ్ఞులు, రాజనీతి శాస్త్రజ్ఞులు మొదలగు వారు తాము సేకరించిన వివరాలన్నిటిని విశ్లేషించి చూస్తే 21వ శతాబ్దము సంపూర్ణ మానవజాతి అంతరించకపోతే - సత్యయుగపు పరిస్థితులు మరల ఏర్పరచ వచ్చునని భావిస్తున్నారు.

మహాకాలుని సృజనాత్మక శక్తికి తదనురూపమైన నటువంటి గాయత్రీ మహాశక్తి యుగశక్తిగా ఆవిర్భవిస్తోంది.

గాయత్రీ తత్వజ్ఞానము నేటి యాంత్రిక సంపత్తి కలసి నూతన యుగమునకు కావలసిన మార్పులు, ప్రజాభిప్రాయాన్ని నిర్మాణాత్మక దిశకు మారుస్తుంది. మానవుల దుర్బుద్ధి వలన ఏర్పడిన ఈనాటి వాతావరణ కాలుష్యం త్వరగా మంచిగా మారుతుంది. మనలో భావసంవేదనలు, శ్రద్ధ, ప్రజ్ఞ నిష్ఠ లాంటి తత్వములు మనలను సన్మార్గాన నడిపించును.

---

వ్యక్తి విద్వాంసుడో, ధర్మోపదేశకుడో అతను తనను తాను ఎంతగా తపింపచేసుకుంటాడో దానిమీదే అతని ఆంతరిక స్థితి ఆధారపడి వుంటుంది.

సంత్ రబియా అడవిలో తపస్సు చేసుకుంటున్నది. జంతువులు, పక్షులు చుట్టుప్రక్కల కూర్చుని నవ్వుతూ ఆడుకొంటున్నాయి. హసన్ అనే ఇంకొక సంత్ రబియా కూర్చున్న స్థలానికి వెళ్ళేసరికి అన్ని పక్షులు జంతువులు అక్కడి నుంచి పారిపోయాయి. అతనికి ఆశ్చర్యమేసింది. నీ దగ్గర ఇంత సన్నిహితముగా ఉన్న జంతువులు, పక్షులు నన్ను చూడగానే పారిపోయాయి ఎందువల్ల అని రబియాను అడిగాడు. రబియా నవ్వుతూ ఇలా అన్నది — "వ్యక్తి తనను గూర్చి తాను ఏమనుకుంటాడో అతని ఇష్టము. కాని మన హృదయము ఎలా వున్నది మనకు తెలియకపోయినా జంతువులు చక్కగా తెలుసుకుంటాయి".

— అఖండజ్యోతి సెప్టెంబరు పేజీ నెం. 4

వివాహమంటే రెండు ఆత్మల కలయిక, శరీరాలు కాదు. శరీరమును చూచేవారు బహుమూల్య అవకాశాన్ని పోగొట్టుకుంటారు.

అత్రి మహర్షికి అపాల ఒక పుత్రిక వున్నది, ఆమె పెద్దది అవుతుండగా ముఖముపై తెల్లని మచ్చలు రావటం మొదలుపెట్టాయి. ఎన్ని మందులు ఇచ్చినా ప్రయోజనం లేకపోయింది. అవి ఇంకా పెద్దవి అయ్యాయి.

ఆమెకు వివాహం చెయ్యాలని వరుని కొరకు వెతకటం మొదలుపెట్టారు. ఆమె జ్ఞానసంపత్తిని విని చాలామంది వచ్చారు. కాని తెల్లని మచ్చలను చూచి తిరిగివెళ్ళారు. వృతాశ్వ అనే ఋషి శిష్యుడు ఏమి అడుగకుండా, ఏమి చూడకుండా భావావేశముతో పెళ్ళి చేసుకున్నాడు.

కాని ఇంటికి వెళ్ళిన తరువాత ఆమె చర్మదోషాన్ని చూచి ఆమెను ఋషిని, తనను తానే తిట్టుకోవడం మొదలుపెట్టాడు. ఎవరి మీద భారముగా ఉండటం ఇష్టంలేక ఆమె తిరిగి తండ్రి వద్దకు వెళ్ళింది. జీవితమంతా ధ్యాన తపస్సుల మీద వినియోగించుకొని ఋషిత్వము సాధించుకున్నది. చర్మదోషముతో పోలిస్తే ఆమె జ్ఞానము, చరిత్ర చాలా గొప్పవి.

---

**PRINTED BOOK POCKET**

To

---

Printed & Published By Gayatri Pragna Peetham Kamepalli Editor ; I. Vijaya Bhaskar Reddy, Cross Roads, Santhamagulur (P. O & Mandal) Prakaasm(Dt.) Pin: 523302